


మినీ కవితా
సంకలనం

# రవ్వలు

గంగిశెట్టి లక్ష్మీనారాయణ

# రవ్వలు

## మినీ కవితా సంకలనం

ప్రచురణ




రిజిష్టర్డ్ నెం 1/64

యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
5 కింగ్స్‌వే, సికిందరాబాదు-3

**RAVVALU**—An Anthology of mini poems by Yuvabharathi Sahithimithras, Bharatimithras and Bharati Bhushanas



యువభారతి

ప్రచురణ : 91

ప్రథమ ముద్రణ : 5 జూన్ 1983

ప్రతులు : 1,200

ముఖచిత్ర రచన : శ్రీ శీలా వీర్రాజు

ముద్రణ :

పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్
హైదర్‌గూడ, హైదరాబాదు.

ముఖచిత్ర ముద్రణ :

బాలాజీ ఆర్ట్ ప్రింటర్స్, హైదరాబాద్-20

ప్రతులకు :

యువభారతి
5, కింగ్స్‌వే, సికిందరాబాదు-500003 లేదా
యువభారతి కార్యాలయం
ఆంధ్ర సారస్వత పరిషత్ భవనములు
తిలక్ రోడ్డు, హైదరాబాదు-500001

వెల : రూ. 3-00

# యువభారతి పరిచయం



మనిషిలో అంతర్లీనంగా నిక్షిప్తంగా ఉన్న ప్రతిభా పరిమళాలు పరివ్యాప్తం కాగలిగినప్పుడే అతని సృజనాత్మక శక్తికి సార్థకం చేకూరుతుంది. సమాజంలో సౌందర్యం, సౌజన్యం పెంపొందటానికి అనువైన వాతావరణం ఏర్పడుతుంది. పరస్పరావగాహనం జరుగుతుంది. నిర్మాణాత్మక దృక్పథాలకు ప్రాచుర్యం లభిస్తుంది. సమైక్య భావాలు కుదురుకుంటాయి.

యువభారతి గడచిన ఇరువయ్యేళ్ళుగా సమాజంలో సామరస్యాన్ని పెంపొందించేందుకు సాహిత్యంకంటె ఇతరమైన సాత్విక సాధనం లేదనే విశ్వాసంతో ఇతోధిక కార్యక్రమాలు రూపొందించి కృషి చేస్తున్నది. సాధ్యమైనంత తక్కువ వెలకు వీలైనంత ఎక్కువ మందికి ఉత్తమ సాహిత్యాన్ని అందజేస్తే సాహిత్యంపట్ల ప్రజానీకానికి ఆనురక్తి పెరుగుతుందనే నమ్మకంతో ప్రచురణ కార్యక్రమాన్ని చేపట్టింది. ఇంతవరకు 90 పుస్తకాలను ప్రచురించి మూడు లక్షల ప్రతులకు పైగా సాధ్యమైనంత తక్కువ వెలకు తెలుగు పాఠకులకు అందించ ప్రయత్నించింది.

భారతదేశంలో ఎక్కడున్నాసరే యువభారతి నిర్వహిస్తున్న సాహిత్యోద్యమంలో పాలు పంచుకునేందుకు ప్రారంభింపబడిన సాహితీమిత్ర పథకంలో 8,200 మంది సహృదయులు చేరి ప్రణాళికను విజయవంతం చేసినారు. యువభారతి భవిష్యన్నిర్మాణంలో సహకరించేందుకు ఆరంభింపబడిన సభ్యత్వ పథకాలలో భారతీమిత్రులుగా 876 మంది, భారతీభూషణులుగా 110 మంది చేరారు.

ఉదుతాభక్తితో మేము చేస్తున్న భాషాసేవకు అండదండలుగా నిలిచారు ప్రజలు. వారి సౌహార్దం, భాషా ప్రియత్వం ఇవే మా పెట్టుబడి. మా తపస్సు ఫలించి తెలుగుదేశంలో అధ్యయనశీలత, సౌజన్యం పెంపొందాలని ఆకాంక్షిస్తున్నాము.

సహృదయుల సహకారాన్ని అర్థిస్తూ—

హైదరాబాదు,
జూన్, 5, 1983.

ఇరివెంటి కృష్ణమూర్తి,
అధ్యక్షుడు: యువభారతి.

# మా మాట

ఉత్తమ సాహిత్య ప్రసరణానికి అనువైన వాతావరణం కల్పించాలనే లక్ష్యంతో 'యువభారతి' గడచిన ఇరువదేండ్లుగా కృషి చేస్తున్నది. మేము నిర్వహిస్తున్న సాహిత్యోద్యమానికి సహృదయుల ఆదరాభిమానాలే, వారందిస్తున్న సహకారమే ప్రోత్సాహాన్ని కలిగించకలుగుతున్నవి.

మా 'యువభారతి'కి చేయూతనిస్తున్న వారిలో మా సంస్థ సభ్యులేకాక మా 'సాహితీ మిత్ర' పథకంలో చేరిన సభ్యులు, 'భారతీ మిత్ర' పథకంలో చేరిన సభ్యులు, 'భారతీ భూషణ' పథకంలో చేరిన సభ్యులు సాహిత్య అధ్యయన, ప్రసరణముల పట్ల ఎంతో ఆసక్తి ఉన్నవారు. వారిలో కొందరు కవులూ, కథకులూ, విమర్శకులూ ఉన్నారు. మంచి రచయితలుగా వాసి కెక్కిన వారున్నారు. 'యువభారతి' వీరి ప్రతిభాస్ఫూర్తితో తన ప్రచురణలను కొన్నింటిని సువర్ణమయం చేసుకోవాలని సంకల్పించి ఇంతవరకు, 'వీచికలు', 'అక్షరాలు', 'స్వరాలు' 'వేడివెలుగులు', 'ఉషస్సు', 'ఉదయం', 'కథావాహిని' వంటి కవితా కథా సంకలనాలను ప్రచురించింది. ఈ 'రవ్వలు' మా 'యువ భారతి'కి అండగా నిలిచిన 'సాహితీ మిత్రులు', 'భారతీ మిత్రులు' 'భారతీ భూషణులు' కొందరు వ్రాసిన మినీ కవితల సంకలం. రచనలు మాకు అనేకం అందినవి. కాని మా యువభారతి 'కవితా మతి'ని అలరించిన వాటిని ఎంపిక చేసి ప్రచురిస్తున్నాము.

ఝటితి స్ఫూర్తితో కవిత తళుక్కుమంటుంది మినీ కవితా ప్రక్రియలో. సూర్య కాంతిలా, చంద్రకాంతిలా, నక్షత్ర కాంతిలా, దీపకాంతిలా కనులముందు నిలువదు. శంపాలతా సన్నిభంగా ఒక్కసారి మెరిసి ఆశ్చర్యంలో, ఆనందంలో, ఆలోచనలో ముంచెత్తుతుంది నిన్నటి చాటు పద్యంలా. అందుకే డా॥ సి. నారాయణరెడ్డి గారు 'మినీ కవిత'ను 'సౌదామినీ కవిత' అన్నారు. "అల్పాక్షరములందు అనల్పార్థ రచన, కల్పించుటయె కాదె కవి వివేకంబు'' అన్న పాల్కురి సోమనాథుని అభియుక్తోక్తికి మినీ కవిత చక్కని లక్ష్యమనిపించుకుంటుంది.

తమ రచనలు పంపి ఈ సంకలనాన్ని ప్రచురించే అవకాశాన్ని కల్పించిన మా 'యువభారతి' 'సాహితీ మిత్రులకూ', 'భారతీ మిత్రు'లకూ, 'భారతీ భూషణు'లకూ మా కృతజ్ఞతలు. ఈ 'రవ్వలు' సంకలనానికి సహృదయ రంజకమైన పీఠికను సమకూర్చిన మా 'యువభారతి' ప్రచురణల ప్రధాన సంపాదకులు, విద్వాంసులు డా॥ జి.వి. సుబ్రహ్మణ్యం గారికి అభినందనములు.

హైదరాబాదు. —ఇరివెంటి కృష్ణమూర్తి.

జూన్ 5, 1988 అధ్యక్షుడు, యువభారతి

# విలువల విందు

మన మధ్య బాగా మసలుతున్న మినీ కవితను గురించి యిప్పుడు ప్రత్యేకంగా పరిచయం చేయవలసిన అవసరం లేదనుకుంటాను. ప్రక్రియతో పాటు, ప్రక్రియా పరిజ్ఞానం గూడా విమర్శలో వెలువడింది. శ్రీ అద్దేపల్లి రామమోహన్ రావుగారు 'మినీ కవిత' మీద చక్కని వ్యాసాలు వ్రాశారు. వారంటారు- ''మినీ కవిత'కి ఉచ్ఛ్వాసం 'క్లుప్తత'. నిశ్వాసం 'ధ్వని'. రాసే కవి ప్రతిభనుబట్టి ఎంత క్లుప్తతకైనా అవకాశం ఉంది మినీ కవితలో...వాచ్యతా దోషం ఎక్కువైపోతున్న వచన కవితకి వ్యంగ్య వైభవాన్ని నేర్పిన మినీ కవిత, కవి ప్రతిభకు నికషోపలం లాంటిది. నిజమైన మినీ కవిత చదివిన తరువాత చాలసేపు ఆలోచింప జేస్తుంది. చెప్పదలచిన భావాన్ని సూటిగా చెప్పక, భంగ్యంతరంగా చెప్పి, హృదయంమీద ఎక్కువ ముద్ర వేస్తుంది ... సామాజిక చైతన్యమేగాక, సౌందర్యం, ఆత్మావలోకనం, ప్రకృతి, అనుభూతి- ఇత్యాది అనేక విషయాలు మినీ కవితలో వర్ణింపబడవచ్చు...ఈకాలపు ప్రధాన ప్రక్రియ మినీ కవిత.'' అందుకే యువభారతి కూడా మినీ కవితా సంకలనం ప్రచురిస్తున్నది.

ఈ సంకలనం యువభారతి సభ్యులకే పరిమితం కావటం చేత దీని విస్తృతికూడ కొంతవరకు సీమితమైంది. అయినా, ఇందులో రవ్వలవంటి మినీ కవితా ఖండిక లున్నాయి. మెరుపుల్లా మెరిసే భావ వీచికలున్నాయి. మినీ కవితను సుగాత్రితో రూపొందించటం నిరలంకార ప్రక్రియా లక్షణానికి ప్రతీక. 'ఒక్క సిరాచుక్క కావాలి సాక్ష్యం' అనటంలో మినీ కవిత లక్ష్యం వ్యంగ్యం. ఇద్దరు సూర్యుల్ని రెండు నేత్రాలతో పోల్చటం అభ్యుదయమైన అభివ్యక్తి. 'భవిష్యత్తుపై ఆశలను వదలుకోని' మనిషిని చిత్రించటం ఆశావాదానికి ఆట పట్టు. యోగి, ఉద్యోగి ప్రవృత్తుల తారతమ్య వివేచనం భావుకతకు చిహ్నం. 'అనుభవం' సమకాలీన సమాజ చిత్తవృత్తి సమీక్షణం. 'ఆకలిరాగం' అన్నార్తుల ఆక్రందనకు అక్షర శిల్పం. 'రుద్రవీణ' శ్రుతి పెడుతున్న విప్లవ గీతికి పల్లవి. 'పిండి వెన్నెల'లో పిండి శ్లేష చమత్కారం. ఆకలితో రుచించని కౌగిలిలో ఆర్తికంగా ధ్వనించేది జీవనరాగం. అడ్డగిస్తే జనంలో వెలుగొందే విద్యుత్తు విప్లవ విస్ఫులింగం. బొమ్మా బొరుసుల కథ వర్గ భేదాల వ్యధ. ఆదర్శం వెంట వచ్చే కాలిబాట నమ్ముకొన్న దృక్పథం. చీకటి 'నిజరూపం', ఆటంబాంబుల ప్రేలుడు స్వతంత్ర దేశాల్లో ఆరని ఆకలి మంటల జ్వాలా తోరణం, విచ్చ్విలు వ్యక్తిత్వం కోసం పోరాడే వీరశక్తులు. 'పల్లెదిక్కు' బ్రతుకుచీకటికోణాల ఛాయాచిత్రం. 'దాణా' అవినీతిని ఆరగించే ఆధునిక గోమాత ధాతుపుష్టి. వర కట్నాల బిరుదు పట్టం 'ప్రస్తుతోపనిషత్తు'. వాగ్దాన పురాణ వక్రచిత్రం 'వాగ్దానం', అభినయిస్తున్న తోలుబొమ్మలు 'జీవచ్ఛవాలు'. నిజానిజాల నీడలు పడని

నిర్నిమేష స్థితి 'మనసు'. మిత్రునికంటె మిన్నయైనది 'పుస్తకం'. కన్నీళ్ల కథ 'జీవితం'. మోదాంతంగా మొదలయ్యే జీవితం నిలువెల్లా విషాదాంతంగా మారితే విస్తుపోయిన మనిషి మాట 'నాకేం తెలుసు?'. కూలీగా మారిన పట్టభద్రుడు జీవితంలో తొలిసారిగా తెలిసికొన్న సత్యం 'ప్రమోషన్'. 'అమ్మ' అనే అనుభవంలోని అంధకార రుచి 'అంతరంగం'. అరిచే 'ఆమె స్వాతంత్ర్యం పొద్దు తిరుగుడు పువ్వు' అనటం సమకాలీన రాజకీయ చిత్రం. 'బ్రోకరు' నేటి సమాజంలో ఏర్పడిన ఒక క్రొత్త కీపోస్టు. 'ప్రజారోదనం' వినిపించే ఆ కాళరాత్రి చరిత్ర మరచిపోని కంకాళమైత్రి. బ్రతుకుకోసం కులాన్ని, మతాన్ని మార్చే మనిషిలోని సంఘర్షణ 'మథనం'. ఆకాశంలో జానపద జీవితం 'దృశ్యం' 'జీవించటం ఎలాగో తెలియటం నిజంగా ఒక వర' మంటుంది నేటి 'జీవితం.' ఇలా ఒక్కొక్క మినీ కవిత ఒక్కొక్క అనుభవ గుళిక. ఆకృతికి వామనావతారం. తెలిసికొంటే త్రివిక్రమావతారం.

మినీ కవిత సూక్తిలా కనపడ్డా, సూక్తికంటె విలక్షణమైన అభివ్యక్తితో ఆవిర్భవిస్తుంది. జీవితానుభవం సూక్తిలో ప్రతిబింబిస్తే, జీవిత విమర్శ మినీ కవితలో మినుకుమినుకు మంటుంది. జీవితం వివిధ దృక్పథాల చిక్కు సమస్య. దానిని ఒక్కొక్క ముడిగా చూపి, ఒక్కొక్క వెలుగుగా ప్రదర్శించేది మినీ కవిత. ఈ సంకలంలోని కవితలన్నీ మినీ కవితా గౌరవాన్ని మున్ముర్తులా మోసుకొని వచ్చేవి కాకపోవచ్చు. వ్యంగ్యంకంటె వాచ్యంపాలు ఎక్కువైనప్పుడు మినీ కవితకు వెలుగు మందగిస్తుంది. వ్యాఖ్యానం కంటె అఖ్యానం విస్తరించినప్పుడు మినీకవిత పలచబారుతుంది. గమ్యం కంటె గతి విధానం కదను త్రొక్కినప్పుడు మినీ కవిత గేయ కవితకు పినతల్లి బిడ్డలా కనపడుతుంది. అంతస్స్వారాన్ని వీడి అంత్య ప్రాసలకోసం ప్రాకులాడినప్పుడు మినీ కవిత మాటలగారడీ విద్యగా మన్నన కోల్పోతుంది. ఈ సంకలనం మిరుమిట్లు కొలిపే మినీ కవితలతో మొదలై క్రమంగా మాత్రాచ్ఛందస్సుల నాశ్రయించిన గేయ కవితలదాకా సాగింది. ఇందులోని 'కోకిలమ్మ పదాలు' మినీ కవితలా? అని ఎవరైనా ప్రశ్నించవచ్చు. అవునని చెప్పటం కష్టమే కావచ్చు. అయినా, ఒక ప్రయోగం జీవితాన్ని సాగిస్తున్నప్పుడు కాలక్రమేణా సాంకర్యం పొందక తప్పదు. సాంకర్యంలోనూ సహృదయామోదంగా ఉన్నది నిలవవచ్చు. లేదా ఆ జాతినుండి వేరుపడవచ్చు. 'మినీ కవిత'లను ఆహ్వానించిన యువభారతి పిలుపును విని వచ్చిన మినీ కవితలివి. భిన్నరుచుల, విభిన్న ధోరణుల హరివిల్లు ఇది. మినీ కవితల విలువల విందు ఇది.

హైదరాబాదు,
జూన్ 4, 1988

—డా॥ జి.వి. సుబ్రహ్మణ్యం,
ప్రధాన సంపాదకుడు.

# ఇదీ వరుస....

గంగారెడ్డి లక్ష్మీనారాయణ





---

• చుట్టూరా ఆవరించుకుని వున్న
చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడం
కంటె, ప్రయత్నించి ఎంత చిన్న
దీపాన్నయినా వెలిగించడం మంచిది •






# యువభారతి
# మీ అభిప్రాయాల్ని
# ఆహ్వానిస్తున్నది

యువభారతి 'లహరీ' ఉపన్యాస కార్యక్రమాలు - ప్రచురణలు 'నందిని' గూర్చి జనాభిప్రాయాన్ని సేకరించాలని మా సంకల్పం. క్రింది విషయాలపై విలువైన మీ సూచనలు తెలిపితే సంస్థ భవిష్యత్కార్యకలాపాలు తీర్చిదిద్దే ప్రయత్నంలో తాము సహకరించిన వారౌతారు.

* ఈ పుస్తకం చదివారు కదా! మీ అభిప్రాయాన్ని నిర్మొహమాటంగా వెంటనే మాకు తెలిపి - మా కృషిని ప్రోత్సహించండి.

* నందిని శీర్షికలు నచ్చాయా? బాగా నచ్చిన లేక నచ్చని శీర్షికలేవి? ఎందుచేత? ఇంకా ఏయే శీర్షికలు ప్రవేశపెడితే బాగుంటుంది? 'నందిని'ని అత్యుత్తమ సాహితీ పత్రికగా తీర్చిదిద్దేందుకు మీ సలహాలు, సూచనలేమిటి?

* యువభారతి నిర్వహిస్తున్న 'లహరీ' ఉపన్యాస కార్యక్రమాలలో మీరెప్పుడైనా పాల్గొన్నారా? మీ అభిప్రాయమేమిటి? భవిష్యత్తులో 'లహరీ' ఉపన్యాస కార్యక్రమాలు ఎలావుంటే బాగుంటాయని మీరనుకుంటున్నారు?

* యువభారతి ప్రచురణలో కొన్నింటినైనా మీరు చదివారా? మీకు నచ్చిన లేక నచ్చని ప్రచురణలేవి? ఇంకా ఎలాంటివి ప్రచురిస్తే బాగుంటుంది?

* సంస్థ పథకాలు 'సాహితీ మిత్ర' 'భారతీ మిత్ర' 'భారతీ భూషణ'లలో మీరు సభ్యులా? సంస్థ ప్రచురణలు మీకు అందుతున్నాయా?

యువభారతి ప్రచురణలను మీ మిత్రులకు పరిచయం చేయండి. యువభారతి ప్రచురణలను మీరు బహుమానాలుగా ఇవ్వండి. మీకు పరిచయమున్న పాఠశాలలచే కొనిపించండి. మీ పరపతిని వినియోగించి ''నందిని'' లో వ్యాపార ప్రకటనలు ఇప్పించండి.

చుట్టూరా ఆవరించుకొని ఉన్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడంకన్న ప్రయత్నించి చిన్న దీపాన్నయినా వెలిగించాలనేదే యువభారతి ధ్యేయం.

దూరప్రాంతాల మిత్రులు హైదరాబాదు వచ్చినప్పుడు తిలక్‌రోడ్‌లోని ఆంధ్రసారస్వత పరిషత్ భవనంలోని మన కార్యాలయానికి విచ్చేయండని ఆహ్వానిస్తున్నాం.

మీ సహకారాన్ని అర్థిస్తూ- యువభారతి

# MINI కవిత !

Money కవితల
Stereo అట్టహాసాలకు
మూగవోయిన గుణ
శాలీనుల
సేద తీరిచే
Mono సుగాత్రి
Mini కవిత !

-ఎమ్. ఈశ్వరచరణ్ (SM 7635)
కిరణ్ ప్రింటర్స్, సిద్ధిపేట-502 103

# ఆ శ యం

వెయ్యేళ్ళ జీవితం
కాదు
నా లక్ష్యం
ఒక్క సిరాచుక్క
కావాలి
సాక్ష్యం.

-కోట్ల వెంకటేశ్వర్‌రెడ్డి (SM 8047)
దుప్పల్లి . మహబూబ్‌నగర్ జిల్లా-509 110

# మహోదయం

ఎవరన్నారు
ఒక తూర్పు ఇద్దరు సూర్యుళ్ళని
ప్రసవించదని—?

ఇదుగో ఇటు చూడు
నా ఫాలం కింద
రెండు కళ్ళు
చురుగ్గా
తెరుచుకుంటున్నై!

-కొప్పర్తి వెంకటరమణమూర్తి (SM 7699)
జూనియర్ లెక్చరర్, కె. వి. యం. ఛాంబర్స్
కళాశాల, పాలకొల్లు-534 260.

# నైజం

గతమెంతో మేలని
మురిసిపోతాడు
వర్తమానం చేదని
దుమ్మెత్తిపోస్తాడు
భవిష్యత్తుపై ఆశల్ని మాత్రం
వదులుకోలేదు.

-రంభా భాస్కర్ (SM 6542)
చీఫ్ ఇంజనీరు కార్యాలయం,
హైదరాబాదు-500 481.

## ప్ర-యో-గం

ఇద్దరున్నారు
ఒకరు తన ధ్యానంలో
మరొకరు పరధ్యానంలో
తన ధ్యానంలో వున్నవాడు యోగి!
'పర' ధ్యానంలో వుండేవా డుద్యోగి!!

-వి. పి. చందన్‌రావ్ (SM 8098)
3-14-31, నల్లా హనుమాన్ వీధి,
నిజామాబాదు-503 001.

## అనుభవం

అన్నా!
ఇన్నాళ్ళూ నువ్వు
'పైసే ప్రపంచం తమ్మీ!' అంటే-
'కాదు! మంచే ప్రపంచమన్నా!!'
కానీ-
ఇవ్వాళ్ళ
పునాదిరాళ్ళ తలదన్ని
గంతులేస్తున్న రంగుగోడల్ని చూసి,
నువ్వన్నదే నిజమని
ఒప్పుకుంటున్నా!

-కిషన్‌రావ్ తంగెడ (SM 7617)
2-2-1105/6, తిలక్‌నగర్,
హైదరాబాదు-500 044.

# ఆకలి రాగం

కడుపు వీణ
ప్రేవు తంత్రుల
మీటి చూడు
వినిపించు
ఆకలిరాగం

-ఆర్. సుదర్శన్ (SM 6884)
3-1-600, నింబోలిఅడ్డ,
హైదరాబాదు-500 027

# రుద్రవీణ

గుంభనంగా
ఉన్న
ఈ తీగెలు
ఎన్ని
రాగాలు పలికిస్తాయి!
మౌనంగా
ఉన్న
ఈ ప్రజలే......

-పి. అజయ్‌కుమార్ (SM 7730)
హిందీ నికేతన్, పవర్‌పేట,
ఏలూరు-534 002.

# పిండి వెన్నెల

ఎందుకండీ
పిండి వెన్నెల!
కనీసం రొట్టెకయినా
పిండిలేని నెల !!

—యమ్. రామచంద్రరాజు (SM. 7789)
టెలిఫోను ఆపరేటరు
నంద్యాల 518501.

# గిలి

నింగిలో జాబిలి
నేలపై నెచ్చెలి
దేశమంతా ఆకలి
రుచిస్తుందా కౌగిలి?

—ఎలవర్తి చంద్రమౌళి (BM 687)
6-113 ఎమ్. వి. నగర్
తిరుపతి-517502.

# రియాక్షన్

సాగే జనం
జలపాతం లాంటిది
అడ్డువేయ చూశారో
విద్యుత్తుగ మారుతుంది.

—'అల' (SM)
శాంతి నికేతన్ కాన్వెంట్ మోడల్ స్కూల్
రెడ్డిపల్లి, భీమిలి తాలూకా, విశాఖపట్టణం జిల్లా.

# బొమ్మా బొరుసూ

దొంగలు దోచిదోచి
దొరలయ్యారు
దొరలు రాచి రాచి
దొంగల్ని చేశారు
ఆ దోపిడీ రాపిడులు
నాణెపు
బొమ్మా బొరుసులు!

—నూగూరు సుదర్శన్‌రావు (SM 7082)
రూమ్ నెం. 6, హాస్టల్-ఎ, ఒ·యు· కాంపస్
హైదరాబాద్-500 007.

# ఆదర్శం

బహుదూరపు నా పయనంలో
వొంటరినైన నాకు
నను వీడక నాతో నడిచే
నా కాలిబాటే నా నేస్తం!

—కె. ఎస్. కృష్ణప్రసాద్ (SM 7815)
C/o పి. ఎస్. ఎస్. నారాయణ
పి.డి.టి.డి. కైనీ, బాలానగర్, హైదరాబాద్-500 037

# నిజరూపం

చీకటి ఒంటికి
వెలుగు ఇమడదు
వెలుగును ప్రక్కన
చీకటికి వెనుకటి
రూపం తప్పదు

—జనువాడ రామస్వామి (SM 8021)
ప్రభుత్వ జూనియర్ కళాశాల (బాలికలు)
రామగిరి, నల్గొండ-508002.

## ఆటంబాంబులు

సంపన్న దేశాల్లో
ఆటంబాంబుల ఉత్పత్తికి
అన్ని శాంతి దేశాల
వ్యతిరేక నిరసన
స్వతంత్ర దేశంలో
ఆకలి కడుపులతో
ఆటంబాంబులు
అనునిత్యం సరసన.

—జి. నరేందర్ రావు (SM 6845)
DB/339 నాగయ్యగడ్డ, రాయవరం
ఖమ్మం జిల్లా-507118.

## విచ్చుకత్తులు

వాళ్ళు - కాలం కసాయి కత్తి
క్రింద కన్నీరు కార్చే కుత్తుకలు.
వ్యవస్థ ఉక్కుపాదాల నలిగి
స్వేచ్ఛను కోల్పోయిన గొంతుకలు.
హృదయాగ్నిని అదిమిపట్టిన యుధిష్ఠిరులు.
అట్టే కదిలించకు.
వాళ్లే - కార్చిచ్చే
విలయాన్నైనా సృష్టించగల విచ్చుకత్తులు.

—నాదెం శ్రీధర్ (BM 766)
సి.టి.ఒ. కార్యాలయం, 4-5-398, సుల్తాన్‌బజార్
హైదరాబాదు-500 001.

# పల్లె దిక్కు

పల్లెటి దిక్కులో బంజరు చాలులో!
వానెరుగని పొలం చెక్కలు
పచ్చిక దొరకని బక్క ఎద్దులు
అటు ఇటు
పొగలేవని రెల్లు కొంపలు!
నాటిన విత్తనం ఏనాటికి ఏపుగ రావడం
దుక్కి ఎరుగని చేలు వెక్కిరించడం
పద పద
తడియారని కల్లు ముంతలు!
చీకట్ల బ్రతుకులలో చరమాంక ఛాయలలో

—శివపురపు జవహర్‌లాల్ (SM 7947)
కృష్ణ గేజింగ్ డివిజన్, సెంట్రల్ వాటర్ కమీషన్,
ఎ.సి. గార్డ్స్, హైదరాబాదు-500 004.

# దాణా

పచ్చగడ్డి మేస్తూ
బాగా ఆరోగ్యంగా ఉన్న ఆవు
పాలు పితకపోతే
పళ్ళూడేలా తన్నుతుంది
అప్పటికప్పుడు
తట్టకేసి దాణా పెడితే మాత్రం
ఎంచక్కా చేపుతుంది
చిక్కనైన క్షీరధార లొలుకుతుంది.

—డాక్టర్ పి. ఎల్. శ్రీనివాసరెడ్డి (SM 6964)
ఆంధ్రోపన్యాసకులు, శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం,
అనంతపూర్-515 003

# ప్రస్తుతోపనిషత్

జీవిత 'కర్మాగారం'లో
'వరుడు' ఉద్యోగానికి
వయః పరిమితి లేదు
సౌందర్యమూ,
సౌశీలమ్మూ కాదు కావల్సింది.
'కట్నాల' లంచమూ
'లాంఛనాల' సిఫారసూ
వుంటే చాలు !

–ద్వా. నా. శాస్త్రి (BM 70)
ఆంధ్రోపన్యాసకులు, ఎస్. కె. బి. ఆర్. కాలేజి,
అమలాపురం-533 203.

# వాగ్దానం

దానకర్ణులు పుట్టిన
పుణ్యభూమి మనది
అందుకే
అందుకుంటున్నాం
ఎడతెరిపిలేని
'వాక్...దానాల'ను

–డా॥ అల్లూరి రాజకుమారి (BM 697)
ఎ. ఎస్. రాజు మెమోరియల్ నర్సింగ్ హోమ్,
రాజోలు-533 242

## 'జీవచ్ఛవాలు'

గుర్తింపు కోసం స్నేహం
గొప్పకోసం సంస్కారం
రుచికోసం ప్రేమ
లాభంకోసం అణకువా
నిమిష నిమిషం మనిషి అభినయిస్తోంటే
బతకడం కోసం మనం
క్షణక్షణం చస్తున్నామనిపిస్తోంది.

—చవ్వాకుల రమణమూర్తి (SM 691)
ఆఫీసర్, ఆంధ్రా బ్యాంక్,
ఛాత్రపూర్, గంజాం జిల్లా, ఒరిస్సా.

## మనసు

కలలు కనేవేళ
కనులు మూసినవేళ
కనుగొనలేదీ మనసు
నిజానిజాలు

—డా॥ వాసా ప్రభావతి (SM 6679)
11/2 RT మున్సిపల్ కాలనీ,
మలక్‌పేట, హైదరాబాదు-500 036

## పుస్తకం

ఓ వంద రూపాయలు
సంపాదించడం కన్న
మంచి మిత్రుణ్ణి సంపాదించడం
చాల కష్టం
వందమంది మిత్రుల్ని
సంపాదించడంకన్న
ఓ మంచి పుస్తకం
సంపాదించడం మరీ కష్టం.

—కాకరపర్తి మార్కండేయులు (BM 7.8)
తెలుగు పండితులు, ఎమ్.ఆర్. మోడల్ హైస్కూల్,
విజయనగరం-531 202.

## క్రొవ్వొత్తి

జీవం లేనిది,
చలనం లేనిది,
జ్ఞానం లేనిది,
అయితేనేం?
తన సర్వస్వం కోల్పోతూ
మనకు వెలుగు నిస్తుంది
కాని,
అన్నీ ఉన్న మనమో !

'బో.సి.రా.'
—బోడెం సితారామాంజనేయశాస్త్రి (SM 8013)
చంద్రుగొండ, ఖమ్మం-507 120

# ఆశాదీపం

భూమ్యాకాశాలను
వేరు చేద్దామనే
చేసి చూద్దామనే
మినుకు మినుకు మంటోంది దీపం!
ఈ వెలుగు నిండేనా?!
ఆ కలలు పండేనా?!

-ముళ్ళపూడి సదాశివశర్మ (SM 7549)
2-114, పటేల్ కాలనీ, వికారాబాద్-501 101

# డబ్బు

డబ్బు లేనివాడు కొరగాడు దేనికీ
కాన కాకూడదు డబ్బు ఆర్జన ఓ జబ్బు
అడుగున పడిపోకూడదు మానవత్వం
అని చెప్పేందుకే ఈ నా కవిత్వం.

-'భానుమూర్తి'
పి. శ్రీరామమూర్తి (BM 21)
ట్రైన్ ఎగ్జామినర్, దక్షిణ మధ్య రైల్వే,
కడప-516 004

## కలకాలము

కంటికి కనిపించని ప్రకృతి దృశ్యాలు
వీనుల కందని భావగీతాల హాయలు
కలమున కందని కవిత్వ మాధురీగరిమలు
కలకాలము మార్మోగు కళాద్రష్టల
హృదయపు అరలలోన.

-ఎమ్. రాధాకృష్ణమూర్తి (BM 780)
పంజాబ్ నేషనల్ బ్యాంక్, కర్నూలు.

## నాకు మాత్రమేనా?

జీవితం
దోసెడు కన్నీళ్ళు
పిడికెడు నవ్వులు
అట
ఓ కవి మాట
కానీ—
నాకు
దోసెడు కన్నీళ్ళు
పిడికెడూ కన్నీళ్ళే.

-బి. విజయరామిరెడ్డి (SM 7810)
ప్రిన్సిపాల్, చాణుక్య జూనియర్ కళాశాల,
రాంకోటి, హైదరాబాద్-500 001.

# నా కేం తెలుసు?

ఎన్ని పాటలో పాడుదామని
గొంతెత్తాను.
అవి మృత్యుగీతాలని నాకేం తెలుసు ?
ఎన్ని బొమ్మలో గీద్దామని
కుంచె సవరించాను.
అది నా కుంచె చివరి శ్వాస అని
నాకేం తెలుసు?
నా బాహువులను చాచి
సహస్ర గళాలతో ఆక్రోశిస్తున్నా
ఆధారం కోసం
ఇది జనవాక్యమని నాకేం తెలుసు?

—'పెన్నాశిరాకృ'—

పి.వి.ఎస్.ఆర్.కె. శర్మ (SM 6404)
ప్లాట్ నెం. 71, మెథడిస్ట్ కాలనీ,
బేగంపేట, హైదరాబాదు-500 016.

# ప్రమోషన్

ఊహ తెలిసే వయసులో
పునాదులు త్రవ్వే కూలీలను
చూచి జాలిపడ్డ నేను
ఊహ తెలిసాకా సంపాదించిన
డిగ్రీతో
పునాదులు త్రవ్వే కూలీగా
ప్రజాస్వామ్యపు జీవితంలో
'ప్రమోషన్' తెచ్చుకున్నా!

-ఎ. వెంకట్రావు (SM 7089)
నర్సీపట్టణం-531 116, విశాఖ జిల్లా.

# అంతరంగం

ఆడబొమ్మ కనిపిస్తే
అమ్మగా భావించే పసిడి పసితనం
పారిపోయింది!
ఇప్పుడు
మా మూడేళ్ళ బాబు
ఆడబొమ్మను చూపి
అమ్మ...అమ్మ...అంటూంటే
ఆనందం అనుభవించే అధ్వాన్నపు 'ప్రాయం'
దాపురించింది!!

-అల్లక కేశవరావు (SM 6990)
ప్రధానోపాధ్యాయుడు, ఎస్.యు.పి.
పాఠశాల, ఇచ్ఛాపురం-532 312
శ్రీకాకుళం జిల్లా.

# అంతస్సులో ఆమని

ఆస్వాదన విరిస్తే...
అనుభూతి ఫలిస్తే...
ఆలోచన జ్వలిస్తే...
జ్ఞానం వేసుకొంటుంది
మనసులో స్థిరవాసం
ప్రాణం పోసుకొంటుంది
మస్తిష్కంలో మధుమాసం.

-వై. ప్రభాకర్ (SM 6875)
TRT 284, విద్యానగర్ కాలనీ,
హైదరాబాద్ - 500 044,

# కృషితో నాస్తి దుర్భిక్షం

ఆలోచన ఉన్నవాడికి
అడ్డమెక్కడిది
కృషి ఉన్నవాడికి
కరువు ఎక్కడిది
అశ్రుపూరిత నయనాలతో
ఆకాశం వంక చూస్తే
అన్నమెక్కడిది?

—పి. కృష్ణబాబు (SM. 7869)
సింగవరం, ప. గో. జిల్లా.

# అరవనివ్వండి ప్రభంజనంలా....

ఆమెను నేడు
అరవనివ్వండి ప్రభంజనంలా
తిరగనివ్వండి బొంగరంలా
ఆడనివ్వండి కందుకంలా
పాడనివ్వండి కోయిలలా
నవ్వనివ్వండి వెన్నెలలా
చెప్ప నివ్వండి వసపిట్టలా.
ఆమె రేపో మాపో
అత్తవారింటికి వెడుతుంది
కత్తుల బోనో మరి యేమో అది
ఆమె స్వాతంత్ర్యం పొద్దుతిరుగుడు పువ్వు.

—చల్లా రాధాకృష్ణశర్మ (BM. 598)
18-A, సదాశివనగర్, వండియూర్,
మధురై-625020.

# ఓ బ్రోకరూ!

అమ్మతో చెప్పి అందల మెక్కిస్తావా ?
ఒద్దులే బాబూ !
రేపొద్దున పితూరీలు చెప్పి పిల్లి మొగ్గ లేయించగలవు
అబ్బాయిగారితో మాట్లాడి అధికార మిప్పిస్తావా ?
ఒద్దులే నాన్నా !
చిలక జోస్యంగాడు
పొరుగూరెళ్ళి పోయాడు.
చట్టం పట్టుకున్న ఛాదస్తుణ్ణి చూసి
నాకో ఆసరా చూపెడతావా ?
ఒద్దులే తండ్రీ !
ఆయన అన్నాన్ని
నా అంబలిగా మార్చకు.

—ఎ.వి. రమణప్రసాద్ (SM 6667)
తెలుగు ఉపాధ్యాయులు, పి.ఎస్.యు.పి. పాఠశాల
రాచూరు-534421. ప.గో.జిల్లా.

# ప్రజారోదనం

రాతిరి నట్టనడుమ నిల్చినవేళ
దూరాన్ని లెక్కగట్టే ప్రదేశంలోని
ఒక చెట్టుపై
కోయిల కూతలు
కొందరు విని 'పిచ్చి' అన్నారు.
మరి కొందరు 'విప్లవ' మన్నారు.
ఇంకొందరు ఏమి గానమని
ఆనందించారు.
కాని,
ఆ రాత్రి
దివాంధాలు దాడి చేశాయనీ
అవి కూతలు కావనీ
భయపు ఏడుపుల అరుపులనీ
ఎవరికి తెలుసు ?

-రామగిరి శివకుమారశర్మ (SM 7709)
ఆరాధ్య సదనం, పటేల్‌పూరా,
సిద్ధిపేట-502 103, మెదక్ జిల్లా.

# మథనం

**మనిషి**

**భయపడుతున్నాడు**
తన కులం ఏమిటో పరులకు తెలియకూడదని
జాగ్రత్త పడుతున్నాడు
మతం తన మనుగడకు ముప్పు కాకూడదని
బెంగపడుతున్నాడు
కలవాడైనా పిల్లల్ని పెంచలేనేమోనని

**బహుశః, అందుకే-**
తన పేరులో రెండు కులాలను కలుపుతున్నాడు
మధ్యలో ఒకసారి మతం మారుస్తున్నాడు
స్వచ్ఛందంగా కుటుంబాన్ని నియంత్రిస్తున్నాడు
ఇన్ని ఆరాట పోరాటలకు నలిగి
జీవిక నశించినా, జీవంతో మధనపడుతున్నాడు.

-యన్. పి **అప్పలనాయుడు** (SM 5778,)
స్టెనో, ఫెర్రోఅల్లాయ్స్ కార్పొరేషన్. శ్రీరామనగర్-532 101, విశాఖ జిల్లా.

# దృశ్యం

ముంతల కావిడేసుకుని
ఆకాశం పుంతలో సూరీడు తాత
నత్తనడక నడుస్తున్నాడు!
అక్కడ నింగి నేలో పన్సేయించే సెందరంగోరు
ఆకల్తో సిందులేస్తో
ఘడీకో రకంగా మారిపోతున్నారు!
ఆయన సిందుల్ని సూసి
నింగి నేలో వంగుని పన్సేసే సుక్కలు
కళ్ళు గీటుకుని రహస్యంగా నవ్వుకుంటున్నారు!
అదుగో తూరుపుకాడ
సూరీడు తాత కనబడగానే సెందరం గోరూ
సుక్కలూ ముంతల్దిండానికి ఎల్లిపోతున్నారు!

-డి.యస్. గణపతిరావు (SM 6004)
కాట్రావులపల్లి-533 691, తూ॥గో॥ జిల్లా.

## ఇదీ మన పరిస్థితి

కళ్ళెం చేతిలోనే ఉన్నా
గుర్రం గోతిలో పడింది...
ఓటు హక్కు మనకున్నా
"నోటు"దే అవుతోంది పాలన...
ఆకలికి ఓర్చిన చదువున్నా
ఆఖరికి నిరాశే మిన్న...
"సమత, సమైక్యతాభావాలు"
తెలిసీ ఆచరించలేని పదాలు...
ఇదీ మన పరిస్థితి
ఇకనైనా మారాలి యీ స్థితి.

-వి.బి.కె. శర్మ. (SM 5776)
జూనియర్ అసిస్టెంట్, ఫెర్రోఅల్లాయ్స్ కార్పొరేషన్,
శ్రీరాంనగర్-532 101, విజయనగరం జిల్లా.

## సమాంతర రేఖలు

మది మధురగీతం పాడమంటే
విధి రుధిరపాతం కావాలంటోంది
ఆశలు ఆకాశంలో పయనిస్తామంటే
ఆచరణలు పాతాళంలో పరిగెత్తుతామంటున్నాయి
మనస్సు విషాన్ని కక్కుతానంటే
ముఖం ముసిగా నవ్వుతానంటోంది
స్వప్నం రంగుల్లో కనబడుతుంటే
సత్యం పాలిపోయినట్టుంటుంది
అసహాయత్వం అణిగిఉండమంటే
ఆత్మాభిమానం ఎదురుతిరుగమంటోంది
ఈ సమాంతర రేఖల నడుమ దిక్కుతెలియక దారితోచక
మనిషి జీవితం బిక్కచూపులు చూస్తోంది.

-సంగనభట్ల నర్సయ్య (BM 917)
ఎస్. ఎల్. ఎన్. ఎస్. ఎ. కళాశాల,
ధర్మపురి-505 425, కరీంనగర్ జిల్లా.

## నాగరిక ప్రపంచం

చెరసాలలు ఉరికొయ్యలు
బందూకుల బందోబస్తులు
దోపిడీలు దొంగతనాలు
దొరతనాల దౌర్జన్యాలు
ఆందోళనలు ఆకలి కేకలు
అబలలపై అత్యాచారాలు
కుల మత ద్వేషాలు
జాతి భేద వివక్షతలు
ఉన్న
నేటి ఈ నాగరిక ప్రపంచంలో
విశ్వమానవ నేత్రం విప్పుకునేదెప్పుడో ?
కన్నీటి కాసారాల్లో కలువలు విచ్చుకునేదెప్పుడో ?

— యం.డి. షర్ఫుద్దీన్, (S M 7328)
7 C, రెసిడెన్సీ స్టాఫ్ క్వార్టర్స్,
ఈసామియా బజార్, హైద్రాబాద్-500 027.

## జీవితం

ఈ జీవితమొక రంగులరాట్నం
ఒక చక్రభ్రమణం
తట్టుకోలేక కొందరికి మతిభ్రమణం !
ఈ జీవితమొక రంగుల కల
ఒక చిక్కుల వల
బయటపడలేని కొందరి ఆర్తనాదం !!
కానీ నేనంటాను- ఈ జీవితమొక మధుర స్వప్నం
ఒక రసభరిత కావ్యం
జీవించడం ఎలాగో తెలియడం
ఆహా! అది నిజంగా ఒక వరం !!

— యం.యస్. ప్రసాద్ (SM 7368)
1. C. 7, ఎర్రమంజిల్ కాలనీ,
హైదరాబాద్-500 004

# మౌనమే సహనం

పలుకలేని పర్వతం
మౌనానికి ప్రతీక
కుండపోతగా వర్షం కురిసినా
కదలలేదు అంగుళమైనా
ఉలిపోట్లు పొడిచినా
శిల్పాలు చేసుకున్నా కిక్కురుమనలేదు
ఏళ్ళతరబడి మౌనవ్రతం పాటించిన అది
అగ్నిపర్వతంగా మారి ఉన్నట్టుండి పేలిపోయింది
అంతవరకు జరిగింది
దాని సహనానికి పరీక్ష

– ఇసుకపల్లి సుజాత (SM 7056)
1-2-217/2/1, గగనమహల్ రోడ్,
హైదరాబాద్-500 029.

# వినరవేమా

ఎదుటివాడిని ఎంచాలంటే
వాడి 'చెప్పు'ల్ని వంగిచూడకు
వాడి ఎదలోకి తొంగిచూడు
'చెప్పుల్లో' చేతల్లో చాలా భేదం ఉంది
చెప్పులు కొంతే ఎత్తు ఎదకు అంతుల్లేవు
ఆ అగాధాన్ని పరికించి చూడు
ఎదుటివాడి ఎత్తు ఎంచాలని ఉంటే
వాడి తలవైపుకాదు 'తలపుల' లోకి 'తల' పెట్టు
తలపుల గోతుల బాధలలోనే
యదలు యధార్థాలు దాగి ఉన్నాయి
ఓసారి అటువైపు త్రిప్పు నీ కనుచూపు

- నండూరి వీరభద్రరావు, (SM 7282)
11-1-939/1, పాత మల్లేపల్లి,
హైదరాబాద్-500 001

## ఏది గమ్యం?

మల్లెపువ్వులాంటి చొక్కా తొడిగితే
ఎఱ్ఱగులాబిలా అందంగా కనిపిస్తే
ఆనందంగా ఉన్నట్లేనా, అంబరాని కెగసినట్లేనా?
గులాబి వెనుక వాడి ముళ్లుంటాయి
మనిషి మనసులో ముండ్ల పొదలుంటాయి
అనుక్షణం హృదయానికి గ్రుచ్చుకొంటాయి
ఎన్ని ముండ్లని తీయను
ఎంత కాలమిలా కొట్టుమిట్టాడను
గమ్యంవైపు గమనం సాగేనా
కంటకాల పొదలు క్రమంగా వైదొలగేనా?

-యన్. కుమారదేవరెడ్డి (SM 4872)
తెలుగు పండితులు, పూతలపట్టు-517 124, చిత్తూరు జిల్లా.

## ఊరడింపు

చీమ కుట్టగానే విలపించే గళం
మిన్ను మీదపడినా కిమ్మనకున్నది.
కొంచెం దెబ్బకే జలజలకారే కన్నీరు
కళ్లు పొడిచినా కానరాకున్నది.
ఎప్పుడూ పలికే నాలుక
ఎదలోని సత్యాలే పలకలేకపోతున్నది.
ఏమిటో వైపరీత్యం ?! ఎదిగిన కొద్దీ
మనసు-అవయవాల నడుమ
సహకారం అసాధ్యమై పోతున్నది!
బాధను వ్యక్తంచేసే భాగమే కరువౌతున్నది!!
అందుకే-
కళ్ళ కలాలతో కన్నీటి మసి కారుస్తూ
నిర్మల శ్వేతపత్ర సహృదయుడికి
అక్షర సంకేతాలతో
వ్యథ వ్యక్తం చేస్తున్నాను
ఊరడిల్లుతున్నాను.

-సడ్లపల్లె చిదంబరరెడ్డి (SM 7200) ఎస్.సడ్లపల్లె-515 211, హిందూపూర్.

## కదలిరండు

అరవై ఎనిమిదికోట్ల జనాభా భారాన్ని
మోయలేక నిట్టూరుస్తుంది భరతమాత
నవమాసాలు ఎన్నిసార్లు మోయాలని-పరితపిస్తుందొక
ప్రసవ వేదన భరించలేని అనారోగ్యపు మాత
గంపెడు సంతానంతో సంసారసాగరాన్ని ఎలా ఈదాలో
తోచక సతమతమవుతున్నాడొక జన్మదాత
వీరు దరిజేరే మార్గాన్ని మనసార బోధింప
మూఢనమ్మకాలను సమూలంగా నాశన మొనరింప
కదలిరండు ఓ కవులారా ! కాలయాపన చేయక
కలము పూని సందేశ రచనల సరసముగా వ్రాయ.

-యం మహంతయ్య (SM 7708)
తెలుగు పండితులు, జడ్.పి. హెచ్.స్కూలు, కరన్‌కోటె-501 141, రె వి.రం.జి.

## గుండె

గుండె-ఎంత గట్టిదయితేనేం
ఒక్క కన్నీటి చుక్క
చిల్లుపెట్టగలదు !
గుండె-ఎంత కఠినమైతేనేం
ఒక్క జాలి చూపు
కత్తిలా కొయ్యగలదు !
గుండె-ఎంత జడమైతేనేం
ఒక్క కనుగీటు
చైతన్యవంతం చెయ్యగలదు !
గుండె ఎంత నిశ్చలమైనదైతేనేం
ఒక్క పొగడ్తకు
పొంగి పొరలుతుంది !
గుండె ఎంత కరకుదైతేనేం
మానవత్వం ముందు
తలవంచుతుంది !

-కె. వి. ప్రసాదవర్మ (BM 477)
రైల్వే హాస్పిటల్, డోర్నకల్-506 381.

# రేపు

పసిపాపల బంగారు కళ్లల్లో
భావిమీద నిలుపుకున్న ఆశలు
యువత ఉడుకు రక్తపు పొంగులో
సమాజం మీద నిలిపిన ఆశలు
కోటి కోర్కెలను నింపుకొని వివాహజీవితంలో
అడుగుపెట్టే అమాయకపు కన్నె ఆశలు
తనవారు తనకాలంబనగా ఉంటారనే
తరుణి వృద్ధాప్యపు జీవితంలో ఆశలు
ఇలాగే పలురకాల ఆశలన్నీ
జీవితపు ఎడారి గాడ్పుల ఇసుకలో కప్పబడిపోయినా
యింకా రాబోయేరేపు ఏదోమార్పు తెస్తుందన్న ఆశతో
రాజీపడి బ్రతుకుతాడు మానవుడు
అదే లేనినాడు బ్రహ్మ తన సృష్టినే నిల్పుకోలేదు.

- ముదిగొండ శ్యామల, (B M 240)
'The Dawn', బేగంపేట,
హైదరాబాద్-500 016.

# సత్యం - శివం - సుందరం

ప్రభాకరుని స్పర్శతో
కఠిన శిలాసదృశమైన
హిమగిరి శృంగం నైతం
చలిస్తుంటే
మానవునిలో స్పందన
కలగకుండా ఉంటుందా?
నీ దేశం కోసం
నీ ప్రజలకోసం
నీదంతా త్యాగంచెయ్ !
అగోచరమైన విధి మీద
భారం మోపకుండా కృషిచెయ్
మహోన్నతంగా ఎదుగుతావ్ !
విశాల వియత్తలంలో
విహంగంలా విహరించి
నే కనుగొన్న సత్యం-
మాతృమూర్తి, మాతృభూమి కంటె
సుందరమైనది లేదీ జగత్తులో !

– డా॥ కోడూరు ప్రభాకరరెడ్డి (BB 107),
శిశువైద్యనిపుణులు,
పద్మా చిల్డ్రన్స్ హాస్పిటల్, ప్రొద్దుటూరు.

## హృదయ జ్వాల

మదిలోన విషపు గాలులు చోటుచేసుకున్నాయి
ఇంక మలయమారుతాలకుగాని, మధువుచినుకులకుగాని
తావులేదు ఈ రాతిగుండెలో
నాలోన మానవత్వమేనాడో వాడిపోయింది, దానవత్వమేనాడో
రేగిపోయింది;
మానవత్వాన్ని మీరు నలిపారు, రాక్షసత్వాన్ని నేను పెంచాను.
అందుకే అమృతమొలుకు అధరాలపైన హాలాహలాన్ని
వొలికిస్తున్నాను
కరుణచిలికే కళ్లల్లో క్రోధాగ్నులు నింపుతున్నాను.
అణువు అణువున రగులుతూ ఆకాశంవరకు ఎగిసిపోతున్నాయి
కడలినెత్తి కుమ్మరిస్తారా- కడలిలోనే రగులుతాయి జ్వాలలు
భూమ్యాకాశాలనంటి ఏకధాటిగా సాగి నరలోకాన్నంత
నాశనం చేస్తేనే
నాలో మీరు రేపిన సెగలకు, నాలో రగిలిన కసికి తృప్తి
కలుగుతుంది

—బుద్ధపురం జగన్మోహనరావు.

## పేరెందుకు లెండి

'సంఘ సంస్కరణ కలాల'లో 'స్వార్థం సిరా' పోసి,
కవితలూ, కథలూ రాసి విసిరేస్తుంటారు వీధుల్లోకి
పనిలేని, ఒళ్లొంగని కవులూ, కథకులూ కోకొల్లలుగా;
అటుగా పోతున్న కొందరు డబ్బున్న బుద్ధున్న ప్రబుద్ధులు,
విడిగా పడిఉన్న వాటిని వడివడిగా యేరి, కూర్చి,
విరజల్లుతుంటారు జనాలపైకి సంకలనాలుగా, చలనచిత్ర
సుమజల్లులుగా;
అటు వారు, యిటు వీరు వెదజల్లిన కావ్య దృశ్యకావ్యాలను
అందుకోనూలేక, అరిగించుకోలేక, అలమటిస్తున్నది
అర్భక ప్రజాళి అనేక విధాలుగా.

— బి. శ్రీధర్రావ్ (S M 7667)
రోడ్ ప్లాంట్ వర్క్స్, జెస్సోప్ & కం. లిమిటెడ్ దండం, కలకత్తా-700 028.

# ఎవరు మీరు ?

ఎవరు మీరు?
మీరంతా ఎవ్వరు ??
ఆరిపోయిన ప్రమిదలు
రాలిపోయిన పువ్వులు
సమిధలు - ప్రమిదలు
దగాపడ్డ వనితలు
అనాధలు - అభాగ్యులు
ఊరు బయట
రోడ్డుప్రక్కన - కాల్వగట్లలో
చర్చిలు - మసీదులు
అరుగులు - మరుగులు
సర్వం ఆక్రమించుకొని
ఆక్రందించేవాళ్ళు
మీరంతా ఎవ్వరు ??
రోదించే - వేదన ధ్వనులు
ఆకలికి ఓర్చలేక
వినిపిస్తున్న మీ కేకలు
ఈ విషసమాజానికి వినపడవు
మీ రూపులు - కనపడవు
విశ్వాన్ని శోధిస్తూ-
పై చుక్కల్ని లెక్కిస్తున్నారు
దీనులు - హీనులు
దిక్కులేని బ్రతుకుల్ని ఈడ్చే
చరిత్రహీనులు - మీరు
మీరంతా ఎవ్వరు ??

—కె బాబు (SM 7288) (కె. బాబులాల్)
18-9-179, చంద్రాయణగుట్ట, కేశవగిరి, హైదరాబాదు-500 005.

## గొంతెత్తిన సూర్యుడు

సరస్సుకు జీవం బిందువు
బిందువు ఇంకిపోదు
మరో బిందువుతో కలసి
తరంగమై సరస్సంతా వ్యాపించి
తీరాల మెదళ్లను తాకుతుంది
తరంగంమీద తరంగమై కదిలిస్తుంది
తరంగాలు ఏ సూత్రాలకూ ఖైదీలు కావు
మెదడు తన కళ్లతో సరస్సును తిరగేస్తే
తరంగాల ధ్వనులకు మెదడు స్పందిస్తుంది
రేపటి ఉదయాన్ని స్వేచ్ఛగా గొంతువిప్పి ఆహ్వానిస్తుంది.

- జె.యస్.ఎ. రామశర్మ (SM 7199)
నెం. 59, సుందరనగర్ కాలనీ,
హైదరాబాదు-500 088.

## అక్షరాలు - మాటలు

అక్షరాలు చేస్తుంటే నృత్యం
మాటలు పాడుతుంటే పాటలు
కవి కలం తొక్కుతుంటే కదం
గళం సవరిస్తుంటే స్వరం
హృదయం మీటుతుంటే వీణ
కరాలు వేస్తుంటే తాళం
మనసు కురుస్తుంటే అమృతం
మెదడు వేస్తుంటే విశ్వకళ్యాణ ప్రణాళిక
కవి కాలేడా కాలమాలకు ముత్యం ?
పట్టలేడా కాలగమనానికి కాగడా ?

–ఎల్. మాలకొండయ్య (BM 267)
8-3-1005, శ్రీనగర్ కాలనీ,
హైదరాబాద్-500 088,

# కవిత

అమ్మా ! కవితా ! రాయంచల తారళ్యం
గోస్తనీ రుచుల మాధుర్యం,
'ఆత్మవత్సర్వ భూతాని' అవగాహన,
'కోకిల స్వామి' నాద బ్రహ్మము
ఎండమావులైనవి నీలో నేడు;
సామాజిక స్పృహ అంటూ వర్గపోరాటము
విప్లవము పేరిట విద్వేష జ్వలనము
పీడితుల పేరిట కుహనావాదాలు, కుయుక్తులు
వికృతమొనర్చినవి నీ భవ్యరూపాన్ని
కరవైందమ్మా విశ్వశ్రేయస్సే నేడు.

"అరుణప్రియ"
డా॥ బద్దెపూడి రామచంద్రరావు (BM 761)
P. B. నం. 503 విజయవాడ-520 003.

# తీరని కోరిక

నింగి వంగి చూస్తుంది చుక్కలతో
చక్కని చుక్కలతో
నీలి నీట తనప్రేమ ప్రతిఫలించి
ఒక్కొత్తున యెదిగి యెదిగి
విన్వీధి ఒడిలో వొదగాలని కడలి
ఆరాటంతో పోరాటం చేస్తుంది,
అనురాగపు అలల నెగదోస్తుంది.
"కోరేదెల్లా ఒనగూడేదైతే పస ఉండదు
ప్రతి పనిలో"
అందుకేనేమో,
కలవాలని కలలుగనే కడలీ గగనం
ప్రణయం
విడదీయును విధి సతతం.

—మర్మాముల దత్తాత్రేయశర్మ (SM 8046)
ఉస్మానియా విశ్వవిద్యాలయం, హైదరాబాదు.

# రూపాంతరం

శిల-
శిల్పి చేతిలో పడితే
శిల్పమై అలరిస్తుంది !
చినుకు-
స్వాతి చిప్పలో పడితే
ముత్యమై భాసిస్తుంది !
మనసు-
మమకారంతో నిండితే
మానవత్వం దీపిస్తుంది !

-సి. కామేశ్వరరావు (BM 772)
తిలక్ నగర్ వీధి, కాశీబుగ్గ-532 222
శ్రీకాకుళం జిల్లా.

# మూగవీణ

బాధ గలిగిన తుమ్మెదల
బరువు తీర్చేడి సాధనాన్ని
సుఖములేని మనసులకు
శాంతి నిచ్చేడి సుగంధాన్ని
మనసు, మమత నిండిన నేను
మనసున్న హృది చేరగలేను
మాట విప్పి చెప్పగలేను
బాట తప్పి నడువగలేను
నేనొక అడవి మల్లెను
నాదొక విషాద గాథ.

[NB. మూగవీణ – వేశ్యాజీవితగాథ.]

–దీవి రంగాచార్యులు (BM 376)
స్వర్ణ-523 170,
పరుచూర్ తాలూకా, ప్రకాశం జిల్లా.

## పురి విప్పిన నెమళ్ళు

ఆమె కళ్ళు
అందాల వాకిళ్ళు
ఆనందాల హరివిళ్ళు
శాంతిరూపాల లోగిళ్ళు
సుఖ సంతోషాల కౌగిళ్ళు
ప్రేమాభిమానాల సంకెళ్ళు
సేద హృదయాలపై పన్నీటి జల్లు
అనురాగ అభిమానాల నెలయేళ్ళు
ఆమె కళ్ళు
భువిలో పురివిప్పిన నెమళ్ళు!

"రాగప్రియ"

-పి.వి.యస్.యస్. రాఘవరావు (SM 76:9)
16–11–20/A/8, సలీంనగర్ కాలనీ,
మలక్‌పేట, హైదరాబాదు-500 084.

## మా పాపాయి

మా చిన్న పాపాయి
నుదురు దాయి దాయి
సోకైన తలపాయి
ఆకాశ తలమోయి
చురుకైన కనుదోయి
చుక్కలకు ఎదురోయి
చెలువైన అరచేయి
కలువ మందిరమోయి
నోటి నగవుల హాయి
సాటి వెన్నెల రేయి

- జె.వీరభద్రరావు (SM 7148)
కాట్రావులపల్లి–533 691, తూ॥గో॥ జిల్లా.

# ఆరాధన

కన్ను మూసినా, కన్ను తెరిచినా
ఈ ఇలలో, నా కలలో
కన్పించెనే నీ మోమే!

భావం మెదిలిన, కలం కదలిన,
తలుపులు తట్టినా, కన్నులు వెదికినా,
నీ ఊహే నా గమ్యం !!

ఆకులు గలగలమన్నా
అడుగుల సవ్వడి విన్నా
అలల ఒయ్యారపు నడకలు చూస్తున్నా
నీ ఊహే నా గమ్యం !!!

-ఎం. వి. చంద్రశేఖరరావు (SM 7919)
F.A.& C.A.O. ఆఫీస్, దక్షిణ మధ్యరైల్వే,
సికింద్రాబాదు-500 371.

# మనసులో మాట

నవ్వకే మల్లికా
నవ్వుకునే మనసులేదు
పాడకే కోయిలా
పాడుకునే తరుణం కాదు.
అవినీతితో పోరాడి
అలసిన జీవితాలకు
నాలోని తేజాన్నితీసి తినిపించాలి.
మమతా విలువలను కప్పేసిన
అహం పొరలను చితికివేయాలి,
మిడిమిడి మనుషుల జూసి,
"బ్రతకడానికి డబ్బు అవసరం
డబ్బే బ్రతుకు అనుకోవడం మూర్ఖత్వం''
అని చాటి చెప్పాలి.
'తుదకు గెలిచేది - నిలిచేది
మంచితనం - మానవత్వం'
అని నా జాతి భుజం తట్టి లేపాలి
నా మనిషిలో మానవత్వపు బీజం నాటాలి.
అపుడే మనం కలిసి నవ్వుదాం-
గొంతెత్తి పాడుదాం-
మైమరచి ఆడుదాం-

-పానుగంటి గోవిందరాజు (SM 7003)
18-4-681/1, కార్వాన్,
కుల్సుంపురా, హైదరాబాదు-500 267.

# విశ్వశాంతి

విశాల పావన పృథ్వీపై వెలగనీ
మధురచంద్రికా శుభ్రదీధితుల
శాంతి కాంతుల వింత సోయగాలతో
ధ్వాంతం తొలగనీ, ఆసాంతం మెరియనీ
స్వేచ్ఛాపూరిత సుందర వీక్షణాలతో
శాంతి పావురాలెగరనీ, మన విశాల విశ్వవిహాయసంలో
జనత సుఖ సంతోషాలతో మురియనీ
ఘనత జయజయధ్వానాలతో మ్రోగనీ
నిత్యకళ్యాణమై, పచ్చతోరణమై,
సత్యం హసించనీ, అనునిత్యం నివసించనీ...

– యం.వి వెంకటరమణ (S M 6680)
వైష్ణవవీధి, బొబ్బిలి-532 558, విజయనగరం జిల్లా.

# కాలం

కాలం కేవలం క్షణమేనా?
పోయినకాలం తిరిగిరాదా?
ఎదురులేక, బెదురులేక కదలిపోయే
నిముషమన నిలువలేనిది కాలమా?
కాలం......
ఏమి తెలియక ఎగబ్రాకేది కాలమా?
గంటలుగా గడచిపోయేది కాలమా?
వెనుదిరగక వెంటాడేదా?
గడచిపోయే గతమంతా!

కాలం......
కాలం - మరి కాలమే;
కాదంటావా మరి?
కాలానికి కట్టలు లేవు;
కట్టలకు గట్లు లేవు;
క్షణమనక కదలిపోతుంది,
కాలం - ఈ భవిష్యత్కాలం.

–సి. హెచ్. సాయిబాబు, (S M 7293) ముస్లాపూర్-502 263మెదక్ జిల్లా.

# ఉగాది

కోకిల కూసినా చిలుకలు పలికినా
మనసులు కలిస్తేనే ఆమని హాయినిస్తుంది

మల్లెలు నవ్వినా జాజులు విరిసినా
స్నేహం కురిస్తేనే చైత్రం వికసిస్తుంది

చందనం చిందినా కర్పూరం గుబాళించినా
ఎదలు పరిమళిస్తేనే వసంతం శోభిస్తుంది

యుగాలు గడిచినా ఖగోళం గెలిచినా
మనిషి ఎదిగితేనే జగానికి ఉగాది

క్షీరోదధి చిలికినా లక్ష్మి ఉద్భవించినా
అమృతం లభిస్తేనే సుపర్వులకు పర్వం

''భాస్కర్''
– యం. సూర్యనారాయణమూర్తి, (SM 7921)
ఉపన్యాసకులు, 2-114, L.I.G H. క్వార్టర్స్
వికారాబాద్-50. 10 , ఆ.వి. రంగారెడ్డి జిల్లా.

# కవులు అంటే....

కవులు అంటే నాకు ఇష్టం
వారి సాహిత్యమంటే నాకు ప్రాణం
వారి భాషను చూసి
వారి భావన తెలిసి
ఆనంద వీచికలతో అల్లలాడుతాను-నేను
వారి జీవిత గాథలు
వారి జీవిత బాధలు
తెలుసుకొని వ్యధచెందుతాను-నేను
వారు కారణజన్ములై
వారు కావ్యాలు వ్రాస్తే
వారి విద్యాధనం
వారి గుప్తధనమని- తెలుసుకొంటే
కన్నీటిబొట్టు రాలింది - నాకు
అప్పుడు అన్పించింది
వారు మట్టిలో కలిసినా
వారు అమరులై నిల్చారు
వారు లేకున్నా
వారి కావ్యకన్యతో
వారు చిరకాలం నిల్చారు — మనలో
అందుకే కవులు అంటే నాకు ఇష్టం.

— పి. గాయత్రి, (S M 7086)
805/2, RT విజయనగర్ కాలనీ,
హైదరాబాదు-500 457.

# స్నేహం

స్నేహం నిర్వచనం
ఇచ్చి పుచ్చుకోవడం
మాటమాట కలవడం
మనసు తెలుసుకోవడం
నేస్తమనే పిలుపుకు
సార్థకత అన్నిట్లోకి అదృష్టం
ఎందుకోయి నేస్తం
వందలాది పరిచయాలు
చాలు చాలు ఉంటేను
కొద్దిమంది మిత్రులు !
ఎన్నుకో స్నేహితుణ్ణి
నీ పాలిటి దేవుణ్ణి
ఒక్కసారి పొరబాటు
జీవితాన గ్రహపాటు.

–డా॥ వి.వి. బాలకృష్ణ (SM 7857)
ఉపన్యాసకులు, పోస్టు గ్రాడ్యుయేట్ ఎక్స్‌టెన్షన్ సెంటర్,
వెంకటేశ్వరా యూనివర్సిటీ, కర్నూలు-518 001.

# ఆవేదన

వీధిలో నొక మేడ వెలయు నీ వైపు
కొంగ్రొత్త యాచకుడు కదలు నా వైపు
ఎండలో బండలను ఎదిరించు నొకడు
సౌధాంతరములందు సుఖియించు నొకడు
విమాన యానముల విహరింతు రొకరు
చెప్పులైనా లేక చెడుదు రింకొకరు
పెరుగు మేడల జూచి పొంగి పోవలెనో
బడుగు బీదల గాంచి బాధ పడవలెనో
కారణంబేమో యీ కష్ట సుఖములకు
నిలదీసి యడుగవలె నిఖిల నేతలను.

ఆర్. వెంకటేశ్వర్లు (BM 503)
2-2-647/222, బాగ్ అంబర్‌పేట, హైదరాబాదు-500 013.

# సృష్టి బోధ

పండ్లనిచ్చే చెట్టుకొమ్మకు
ఎందుకో ఆ రాళ్ళదెబ్బలు
అందమైన గులాబిమొక్కకు
ఎందుకో ఆ ముళ్ళబోదెలు
వెలుగునిచ్చే దీపమార్పగ
ఎందుకో శలభాల (ఆమిడుత) యత్నం
స్వార్థరహిత జాతి నేతలపైన
ఎందుకో హత్యాప్రయత్నం
చంపకపు వాసనలు గిట్టని
తుమ్మెదలదొక వింత తత్వం
ఉత్పలాల వికాసమోర్వని
సూర్యునిది ఒక మనస్తత్వం
ప్రేమ పంచుక బ్రతుకువారల
మధ్యగల కట్నాల (ఈ వరకట్న) బాధలు
విలువ గల్గిన సువర్ణానికి
వాసనించుక లేని బోధలు

– సి. హెచ్ వి. శివరామ కృష్ణయ్య, (S M 8691)
ఆంధ్రోపన్యాసకులు, గీతా విజ్ఞాన
ఆంధ్ర కళాశాల, నల్లగొండ

# వెన్నెల స్వగతం

అడవినిగాచే వెన్నెలనని అలుసు చేయకుమా
కదలిపొంగుల నవ్వులన్నీ ప్రోగుచేసే పసిబాలను

ప్రాకృతిక అందాలను ఇనుమడించు నెలరాజును
పాలపొంగుల తెల్లవెలుగును అందించే దివ్వెను
కొత్త జంటల ఏకాంతానికి నిలువగలిగే మధ్యవర్తిని
పాతజంటల కొత్త కోర్కెలు గుర్తుచేసే కర్తను!

ప్రేమహృదులకు వంకనై నెలవంకనై
మరుమల్లెల పరిమళాలకు మెత్తదనపు తోడునై
పదిలపరచిన ప్రేమకు కొత్తభాష్యము చెప్పగా
కన్నెతనపు సొగసులన్నీ ప్రియుని సొంతము చేయించగల
ధీమంతను!

నిండు పున్నమివేళలో వెల్లివిరిసిన కాంతిలో
కొత్త కోర్కెల పులకింతలన్నీ మనసులో గిలిగింతలై
చలచల్లని చందనమ్మై మేనంతట పులిమినట్లు పరవశం
కల్గించగా
సకల ప్రాణుల ప్రేమకు వెన్నెలగా పాత్రురాలిని!

-ఆర్. వీరభద్రాచారి (SM 6818)
లంకపల్లి, సత్తుపల్లి తాలూకా, ఖమ్మం జిల్లా.

# కోకిలమ్మ పదాలు

ఓట్ల విలువలు ప్రజకు
తెలియనంతటి వరకు
ప్రజాస్వామ్యమ్మనకు
ఓ కోకిలమ్మ !
కంఠాన గరళమ్ము
కంటిలో అనలమ్ము
ఏ పాప ఫలితమ్ము ?
ఓ కోకిలమ్మ !
అర్ధ భాగము వనిత
మూర్ధ మందున ముదిత
ధర్మ ప్రగతికి కొలత
ఓ కోకిలమ్మ!

మంచుకొండలు నీకు
మండు ఎండలు మాకు
ఎంత జాలో నీకు
ఓ కోకిలమ్మ !
సాక్ష్య మియ్యని నరులు
రక్ష సేయని ప్రభులు
దైవమ్ముతో సములు
ఓ కోకిలమ్మ!
ధర్మ రక్షణ కరము
చేయు సృష్టిని కనుము
ధర్మ రహితుల మయము
ఓ కోకిలమ్మ!

-డా॥ ఎ. కృష్ణప్రసాద్ (SM 6921)
కాట్రావులపల్లి - 533391 తూ॥ గో॥ జిల్లా.

# జాబిల్లి

చిన్ని నగవు మెరవ
తారలన్ని వగవ
కలువభామ దిగువ
కాణాచిగ మురవ
బుల్లి జాబిల్లివ!
నిండు మరు వెల్లివ ?
రోజుకొక్క తడవ
భువిని చుట్టి నడువ
కాలమెంతో గడవ
అలుపు లేదు తలవ
బుల్లి జాబిల్లివ ?
వడికి పుట్టిల్లువ ?

పక్ష దినముల తడవ
మెల్ల మెల్లగ భడవ
పెరిగి తిరిగి నడవ
తిరిగి మరల మడవ
బుల్లి జాబిల్లివ!
పాల చిరు వెల్లివ ?
సన్యాసి నిను పిలువ
వాని సిగను నిలువ
అందాలు తెగ కురవ
సంసారియై మురవ
బుల్లి జాబిల్లివ!
లేక మరుమల్లివ ?

—వి ప్రసన్న కుమార్ (SM 6668)
కాట్రావుల పల్లి - 533391 తూ.గో. జిల్లా.



మా తెలుగు తల్లికి మల్లెపూదండ
మా కన్నతల్లికి మంగళారతులు
కడుపులో బంగారు, కనుచూపులో కరుణ
చిరునవ్వులో సిరులు దొరలించు మా తల్లి

గలగలా గోదారి కదలిపోతుంటేను
బిరబిరా కృష్ణమ్మ పరుగులిడుతుంటేను
బంగారు పంటలే పండుతాయి
మురిపాల ముత్యాలు దొరలుతాయి

అమరావతీ నగరి అపురూప శిల్పాలు
త్యాగయ్య గొంతులో తారాడు నాదాలు
తిక్కయ్య కలములో తియ్యందనాలు
నిత్యమై, నిఖిలమై నిలిచియుండేదాక

రుద్రమ్మ భుజశక్తి, మల్లమ్మ పతిభక్తి
తిమ్మరుసు ధీయుక్తి, కృష్ణరాయల కీర్తి
మా చెవుల రింగుమని మారుమ్రోగేదాక
నీ పాటలే పాడుతాం నీ ఆటలే ఆడుతాం
జై తెలుగుతల్లీ, జై తెలుగుతల్లీ

— శంకరంబాడి సుందరాచార్య